గోదావరి పుష్కరాలు:
రాజమహేంద్రవరంలో
ఏర్పాట్లు: కొన్ని సూచనలు
—2 వ పేజీ.

# ఆంధ్రపత్రిక

3(1930)



THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 29 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO సోమవారం 30-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా

# ఆంధ్ర తెలంగాణా ఉద్యోగవ్యవస్థల లీనానికి అధికారుల చర్చలు

## ప్రాతిపదిక విద్యలో విశ్వాసం అవసరం

### కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు రాష్ట్రపతి హితవు

న్యూఢిల్లీ, ఏప్రిలు 28: ప్రాతిపదిక విద్యావిధానాన్ని ప్రాచుర్యంలోకి తీసుకువచ్చే నిమిత్తం కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వాలు చేస్తున్న కృషి సఫలమై దేశంలో అవిద్య, అజ్ఞానము నశించగలవని తాను ఆశిస్తున్నట్లు రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ నేడు ఇక్కడ అఖిల భారత ప్రాతిపదిక విద్యా మహాసభను ప్రారంభిస్తూ అన్నారు.

"దేశంలో పిల్లలకు విద్య నచ్చేట్టు చేయ్యటంలో ఎన్నో సమస్యలను ఎదుర్కోవలసివస్తున్నది. అయితే ఆ సమస్యయొక్క స్వరూపం తెలిసిన ఎవ్వరుగాని, అందువల్ల నిస్పృహచెందవలసిన అవసరం లేదు. కాని విద్యావిధానాలను అమలు పరుస్తున్నవారికి, విద్యను బోధిస్తున్నవారికి ప్రాతిపదిక విద్య అంటే నమ్మకంవున్నదా, లేదా అన్నది అసలు తేల్చుకోవలసిన విషయం. అది తేలితే అంతా సవ్యంగా సాగిపోతుంది" అని రాష్ట్రపతి చెప్పారు.

ఈ సభను భారత విద్యాశాఖ ఏర్పాటు చేశారు. ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ, ఇతర మంత్రులు, పార్లమెంటు సభ్యులు, ప్రముఖ విద్యావేత్తలు దీనికి హాజరైనారు. ప్రాతిపదిక విద్యాబోధనకు సంబంధించిన కొన్ని ప్రదర్శనలుకూడా ఏర్పాటుచేశారు ఈ సభను ప్రారంభిస్తూ రాష్ట్రపతి యిలా అన్నారు. "విద్యాధికారులకు, విద్యాబోధకులకు ప్రాతిపదిక విద్య సామర్థ్యంలో విశ్వాసం కుదిరితే, ఎటువంటి కష్టంగాని అడ్డురాదు. ఆ విద్య పురోగమనం నిరాటంకంగా సాగిపోతుంది. అట్లా కాక, ఆ విద్యలో విశ్వాసం లేక, పైనుంచి వుత్తర్వులు వస్తున్నాయి గనుక వాటిని పాలిస్తున్నాము కనుక దృష్టితో వీరు వ్యవహరిస్తే ఎంత డబ్బు ఖర్చు పెట్టినా, ఎన్ని సదుపాయాలు కూర్చినా లాభం లేదు. పని ఏమీ జరగదు."

"ఈ విషయంలో వేదాంత ప్రాయాలు వుండవచ్చు. ప్రతి సమస్యలో నూ అట్లాగే వుంటాయి. కాని విద్యవంటి ముఖ్యవిషయంలో రూఢమైనటువంటి అభిప్రాయ భేదాలువున్నా, వాటిని ఈపాటికి మనం తీర్చుకొని వుండవలసింది. తీర్చుకొని వుంటే విద్యావ్యాసంగం ప్రయోగాత్మకంగా సాగే అవకాశం వుంటేది."

"1938 నుంచీ ప్రాతిపదికవిద్యావిద్యావేత్తలలో చర్చలకు గురిఅవుతూనే వుంది. కేంద్ర విద్యా సలహాసంఘం కూడా ఏ యేటికాయేడు ఈ విద్యా మూలసూత్రాలలో తమకు విశ్వాసం వున్నదంటూ, వాటిని ఆమోదిస్తూనే వున్నారు. స్వాతంత్ర్యం వచ్చిన అనంతరంనుంచి కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు ఇందులో శ్రద్ధ వహిస్తున్నాయి. ప్రయోగరీత్యా అన్ని రాష్ట్రాలలోనూ ఈ విద్య ఎంతవరకూ ప్రయోజనకరమో చూస్తున్నారు. ఇందులో ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వస్తున్నది. అయినా వాటిని అధిగమిస్తూ, దేశంలో ఎన్నో పాఠశాలలు తలయెత్తుతున్నాయి. రానురాను ఇంకా పెరుగుతున్నాయి."

"ఇంత జరిగినా మనం ఈ విద్యావిషయంలో చర్చలస్థితిని దాటి ముందడుగు వేశామా అనిపిస్తున్నది. కష్టాలను పూర్తిగా అధిగమించామా అనిపిస్తున్నది. ఈ ప్రశ్నలకు పరిష్కారం జవాబు చెప్పగలస్థితిలో లేము."

"దేశంలో అమలులోవున్న విద్యాపద్ధతిని పూర్తిగా సంస్కరించి కొత్త పద్ధతి అమలు జరిపేటం అంత తేలిక కాదు అన్న విషయం. అయినా ప్రాతిపదిక విద్యావిషయంలో కొంతవరకు ఏకాభిప్రాయం కలదు. అందరూ అంగీకరించవలసిన తప్పు. ఈ విద్యను బోధించే పద్ధతులు ఇంకా స్పష్ట స్వరూపాన్ని పొందలేదు. పైగా విద్యా విధానాన్ని నడుపుతున్న ఉపాధ్యాయులలోను, శాఖలలోను కూడా ఈ పద్ధతి అంటే నమ్మకం కుదిరిన పరిస్థితి కూడా కొంత లేకపోలేదు."

"ప్రాతిపదిక విద్యవల్ల సమస్యలు కొన్ని తీరవు కూడా తీరుస్తాయి. ఆలాగే విద్యావిధానానికి అనువుగా తీర్చిదిద్దిన విద్య

ప్రాతిపదిక విద్య. ఇందులో విజ్ఞాన సముపార్జనకు, వస్తు సృష్టికి కూడా స్థానం వుంటుంది. వస్తువులను సృష్టిస్తూ విజ్ఞానాన్ని గడించుకోవటం ఇందులో మార్గం. ఇందులో సృజనాత్మకమైన ప్రతిభా సంపత్తిగల మనస్సు పెరగడానికి, ఉత్సాహాన్ని ఇనుమడించడానికి వీలువుంది."

## భారతదేశంలో పాక్ హైకమీషనర్

కరాచీ, ఏప్రిల్ 28: భారతదేశములో పాకిస్తాన్ హైకమీషనర్ శ్రీ గజన్‌ఫర్ అలీఖాన్‌ను స్వదేశానికి పిలిపించి పారిస్‌లో రాయబారిగా నియమిస్తారన్న వార్తలను పాకిస్తాన్ విదేశాంగ మంత్రి శ్రీ హమీదుల్ హక్ చౌదరి ఖండించారు.

## 62 వ కాంగ్రెస్ సమావేశం

ఇండోర్, ఏప్రిల్ 28: భారత జాతీయ కాంగ్రెసు 62 వ సమావేశాన్ని ఇండోర్‌లో జరపడానికి మధ్యభారత్ ప్రదేశ కాంగ్రెస్ కార్యవర్గం ఏకగ్రీవంగా తీర్మానించింది.

## తూర్పు పాకిస్తాన్‌లో అఖిల పక్ష ప్రభుత్వ స్థాపనకు కృషి

ఢక్కా, ఏప్రిల్ 18: తూర్పు పాకిస్తాన్‌లో అఖిలపక్ష ప్రభుత్వ స్థాపన విషయమైన ప్రయత్నాలు నాటి నాటికి బలపడుతున్నాయి. పాక్ ప్రధాని చౌదరీ మహమ్మదాలీగూడా ఇందులో ప్రసక్తి పెట్టుకుంటున్నారు. ఆయన నేడు ఇక్కడికి వచ్చారు. తూర్పు పాకిస్తాన్ శాసనసభ ప్రతిపక్ష నాయకుడు అతావుర్రహమాన్‌తో ఈ విషయం మాట్లాడారు. అతావుర్రహమాన్ తూర్పు పాకిస్తాన్ అవామీలీగ్ ఉపాధ్యక్షుడుకూడా.

ఈ సందర్భంలో ప్రధానమంత్రి తూర్పు పాకిస్తాన్‌లో అఖిలపక్ష మిశ్రమ ప్రభుత్వం ఏర్పడటం మంచిదని, ఆటే మంత్రివర్గం రాష్ట్రంలో ఆహార సమస్యను, రాజకీయ పరిస్థితిని చక్కబెట్టగలదని అన్నారట.

అతావుర్రహమాన్ ఇట్టి మిశ్రమ ప్రభుత్వ స్థాపనకు సుముఖత్వాన్ని చూపుతూ, ముందు ప్రస్తుతం అధికారంలో వున్న ప్రభుత్వాన్ని రద్దుచేసెయ్యాలని షరతు పెట్టినట్లు తెలుస్తున్నది. ఈ ప్రస్తుత మంత్రివర్గం రాష్ట్రంయొక్క ఏ సమస్యనూ పరిష్కరించలేక పోయింది. దీని చేతకానితనంవల్ల రాష్ట్రంలో కరువు వచ్చింది అన్నారట.

పాక్ ప్రధాని ఇక్కడి అన్ని పక్షాల నాయకులను కలుసుకొని ఈ మిశ్రమ ప్రభుత్వ స్థాపనను గురించి మాట్లాడతారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని అల్పసంఖ్యాక రాజకీయ పక్షాలయిన కాంగ్రెస్, యునైటెడ్ ప్రోగ్రెసివ్ పక్షాలు కలుసుకొని, తాము అనుసరించవలసిన విధానాన్ని గూర్చి చర్చిస్తున్నాయి. వీరు ప్రధానిని కలుసుకున్నప్పుడు అల్పసంఖ్యాక వర్గాలవారి వ్యవహారాలను గురించి మాట్లాడతారు.

## కామన్వెల్త్ స్వతంత్ర ప్రతిపత్తి

### సింగపూర్ ప్రధాని కోరిక

లండన్, ఏప్రిల్ 28: సింగపూర్ రాజకీయ ప్రతిపత్తిపై లండన్‌లో వారం రోజులుగా సాగుతున్న చర్చలలో బ్రిటిష్ ప్రభుత్వ ప్రతిపాదనలను సింగపూర్ ప్రతినిధి వర్గం పరిశీలించారు. వీనికి ప్రతిగా సింగపూర్ ప్రతినిధి వర్గం తమ ప్రతిపాదనలను మంగళవారం నాడు బ్రిటిష్ ప్రభుత్వానికి అందచేస్తారు.

ప్రధాని శ్రీ డేవిడ్ మార్షల్ నాయకత్వం క్రింద అన్ని పక్షాలకూ చెందిన 15 మంది సభ్యుల ప్రతినిధి వర్గంలో ఏకాభిప్రాయం లేదని శ్రీ మార్షల్ ఒప్పుకున్నారు. అయితే ప్రాథమికాంశాలలో కొంత అంగీకారం ఉందన్నారు. మంగళవారం నాడు బ్రిటిష్ ప్రభుత్వానికి అందచెయ్యనున్న ప్రతిపాదనలపై ఏకాభిప్రాయం కుదిరిందని శ్రీ మార్షల్ చెప్పారు.

కామన్వెల్త్‌లో పూర్తి ప్రజాస్వామ్యస్వాతంత్ర్యం తమ లక్ష్యం అని శ్రీ మార్షల్ వివరించారు.

విదేశాంగ వ్యవహారాలు, దేశరక్షణ బాధ్యతలను మాత్రం బ్రిటిష్‌వారి అధీనంలో ఉంచడానికి సమ్మతిస్తారని శ్రీ మార్షల్ చెప్పారు.

యుద్ధాలు లేని శాంతికాలంలో ప్రతిదేశానికీ పూర్తి స్వాతంత్ర్యం ఉండాలని శ్రీ మార్షల్ అన్నారు. అసాధారణ పరిస్థితుల్లో అయితే ఏదేశమూ వాస్తవానికి సర్వ స్వతంత్రంగా ఉండదు. బ్రిటన్ కూడా సర్వ స్వతంత్రంగా ఉండలేదన్నారు. అందువల్ల ఈ నాటి పరిస్థితుల్లో సింగపూర్‌కి పూర్తి స్వపరిపాలన లభించాలన్నారు.

ఈ సందర్భంలో పరిమిత స్వపరిపాలనకి అర్థం లేదని శ్రీ మార్షల్ అన్నారు. వంతెన ఉన్నదంటే నదిపై ఈ చివరనించి ఆ చివరదాకా ఉంటుంది కాని, సగం మేర ఉన్నా ఒకటే నదిఒంటతో మిద్దెవంతుల మేర నిర్మించినా ఒకటే అసలేమీ లేనట్లే లెక్క అన్నారు.

## సమితిలో రష్యా ప్రాబల్యం పెరుగుతోంది

సమితి కార్యాలయం, ఏప్రిలు 27: ఐక్యరాజ్యసమితిలో రష్యా ప్రాబల్యం 1954 లో కంటె 1955 లో యెక్కువయిందని సమితి సమాచార పత్రిక తెలుపుతోంది.

సమితిలో 1954 లోనూ 1955 లోనూ వోటింగు వివరాలను పరిశీలించి ఈ పత్రిక యీ క్రింది వివరాలను తెలుపుతోంది.

1954 లో కంటె 1955 లో సమితి సభ్యులు మరింత 60 వంతులు ఎక్కువగా రష్యా అభిప్రాయాలతో ఏకీభవించారు.

రష్యాను యుగోస్లావియా బలపరిచిన ఘట్టాలు 78% (1954) నుంచి 88% కు (1955) పెరిగాయి.

బెలో రష్యా, చెకోస్లోవాకియా, పోలండ్, ఉక్రేన్లు కాక పశ్చిమాసియా, వర్మ, ఇండొనేసియా, తూర్పు ఆసియా దేశాలలో ఏడు దేశాలు రష్యాను 1955 లో తిరుమ బలపరుస్తూ వచ్చాయి.

రష్యాను ప్రతిఘటిస్తూ వచ్చిన దేశాలలో అగ్రస్థానం ఈయేడు అమెరికాకు లభించింది (67%).

1954 లో అమెరికా కంటె ఎక్కువగా ఆస్ట్రేలియా, బెల్జియం, కనడా, ఫ్రాన్సు, లక్సెంబర్గ్, హాలండ్, న్యూజిలాండ్, టర్కీ, దక్షిణాఫ్రికా, బ్రిటన్ లే రష్యాను ప్రతిఘటించాయి.

దక్షిణ అమెరికా దేశాలలో మాత్రం రష్యాని సమర్థించటం తగ్గింది. క్యూబా, ముఖ్యమైనవి కొలంబియా, హోండురాస్, హైతి.

## తక్కువ ఆదాయాలవారికోసం కట్టుతున్న ఇళ్లను సిబ్బందికి కేటాయించాలని కేంద్రానికి అభ్యర్థన

## తెలంగాణా వాటాలో అనేక భాషల ఉద్యోగులు: తరలివచ్చేవారి పిల్లల చదువుల సమస్యలు

(స్వకీయ విలేఖరి)

హైదరాబాదు, ఏప్రిల్ 29: ఆంధ్ర హైదరాబాదు ఉన్నతోద్యోగులు ఇక్కడ రేపు ఉద్యోగాల విలీనం సమస్యలను, సిబ్బందికి కల్పించదగు వసతులను చర్చించడానికి సమావేశమవుతున్నారు. రెండు ప్రభుత్వాల ప్రధాన కార్యదర్శులూ కాక బొంబాయి, మైసూరు ప్రధాన కార్యదర్శులు కూడా పాల్గొంటారు.

కేంద్ర సహాయంతో తక్కువ ఆదాయాల వారికి పారిశ్రామిక సిబ్బందికీ కట్టుతున్న ఇళ్ళను ఉద్యోగులకు కేటాయించాలని ఆంధ్ర ప్రభుత్వం చేసిన సూచనపై కేంద్రానుమతి కోసం వ్రాస్తారని తెలుస్తున్నది.

ఈ సమావేశంలో చేసిన సూచనలను తర్వాత మంత్రులు ఆమోదించవలసి ఉంటుంది.

హైదరాబాదు విభజన, ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల విలీనీకరణం కలిపించే సమస్యలను కూలంకషంగా చర్చించి నూతన రాష్ట్రం పరిపాలనా వ్యవస్థను రూపొందించడం కోసం త్వరలో ఇక్కడ ఒక ఉన్నతాధికార సమావేశం జరుగుతుంది.

కొన్నిరోజులక్రితం ఆంధ్రప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ ఒ. పుల్లారెడ్డి ఇక్కడకువచ్చి రాజభవనం, సచివాలయం, హైకోర్టు, శాఖాధిపతుల కార్యాలయాలు, మంత్రులకు ఉద్యోగులకు నివాసాలు – ప్రస్తుతం లభ్యమయే భవనాలు – చూశారు.

### ఓర్పు - సహకారం

జరగబోయే ఉన్నతాధికార సమావేశంలో ఉద్యోగుల శ్రేణులను హోదాలను నిర్ణయించడం ముఖ్యవిచారణీయాంశం. ఉన్నతోద్యోగులు సమావేశమై ఈ సమస్యలపై తమ సూచనలను తయారుచేసిన మీదట, మంత్రులు వీటిని పరిశీలించి తమ నిర్ణయానికి రావలసి ఉంటుంది. రెండు ప్రాంతాల ఉద్యోగుల వర్గాలు పదవీ కాలాలు, వేతనాలు అధికారాలు దృష్టిలో ఉంచుకొని, వీరికి పదవులను తిరిగి నిర్ణయించవలసి ఉంటుంది. శాసనం ప్రకారం తెలంగాణా ఆంధ్రరాష్ట్రంలో కలిసిపోతున్నది. ఇచ్చి పుచ్చుకునే భావంతో, ఓర్పుతో రెండు ప్రాంతాల మంత్రులూ వ్యవహరిస్తే ఇది తీవ్రసమస్య కాజాలదు.

### రాజభవనం

ప్రభుత్వ కార్యాలయాల సిబ్బందికి అందరికీ ఇళ్లు సిద్ధంగా లేవని పాఠకులు ఎరిగిన విషయమే, ఉన్న వసతుల గరిష్ఠవినియోగం, కొత్తవసతుల శీఘ్రకల్పనా జరగవలసిఉన్నది. ముందుగవర్నరు నివాసానికి అనువైన భవనం ఏదీ అని చూస్తున్నారు. నిజాం పెద్దకొడుకు ఉంటున్న 'బెల్లావిస్టా' భవనాన్ని రాజభవనంగా తీర్చిదిద్దవచ్చు. మే ఒకటవ తేదీనాటికి 'బెల్లావిస్టా'ను నిజాంకొడుకు ఖాళీ చేయవలసి ఉన్నది. 'బెల్లావిస్టా' ఆవరణలోనూ, చుట్టుప్రక్కలా రాజభవనం సిబ్బంది కోసం కొన్ని వసతులు ఏర్పాటుచేయవచ్చు.

నిజాం రెండవకొడుకు ఇదివరకు నివసించిన 'హిల్‌ఫోర్ట్' ఉన్నది. కానీ దానిని 5 ఏళ్లు అద్దెకు ఇచ్చారు. ఇది పరిశీలించవలసిన విషయం.

ముఖ్యమంత్రి ఉంటున్న 'షామంజిల్,' సభాపతి ఉంటున్న 'దిల్‌కుష' భవనాలున్నాయి. బంజారాగుట్టలపై చాలా భవనాలున్నాయిగానీ, అవి రాజభవనానికి కొరగావు.

### రెండు సభలు

ఇక శాసనసభకు, సభ్యుల నివాసాలకు భవనాలు కావాలి. నూతన రాష్ట్ర శాసనసభలో (ఆంధ్రనుంచి 196, తెలంగాణానుంచి 105) 301 మంది సభ్యులుంటారు. ప్రస్తుతం ఉన్న శాసనసభా భవనంలో 190 కంటే ఎక్కువమంది పట్టరు. అక్టోబరు ఒకటినాటికి ఈ భవనంలోనే శాసనసభ సమావేశం కావాలి. పత్రికా ప్రతినిధుల స్థానాలను, ఉద్యోగులస్థానాలను వేరొకచోటుకుమార్చి కొంత ఇరుకువసతి సమకూర్చుకుంటారేమో తెలియదు.

ఇది ఇట్లా ఉండగా ఎగువసభ ఒకటి ఏర్పడబోతున్నది. 75 మంది సభ్యులకు సభాభవనం కావాలి. బాగయాంలో జూబిలీభవనం సరిపోతుంది.

సచివాలయ భవనాలు నిర్మించడంతోపాటు శాసనసభా భవనంకూడా కట్టవలసి ఉంటుంది.

ప్రస్తుతపు శాసనసభ్యుల వసతిగృహం 124 మందికే సరిపోతుంది. కొత్తగా వచ్చేవారికి వీలైనా వసతి చూపాలి.

### సచివాలయం

ప్రస్తుతపు హైదరాబాదు సచివాలయంలో 14 శాఖలు పనిచేస్తున్నాయి. 10 మంది కార్యదర్శులు ఉన్నారు. మొదట కట్టిన సచివాలయ భవనాలు ఏదో ముగ్గురు నలుగురు కార్యదర్శులు సిబ్బంది కూర్చోవడానికి అనువుగా ఉన్నవి. తర్వాత మిగతా శాఖలకోసం మూడు భవనాలు కట్టారు. వెయ్యి మందికి పైగా ఇందులో పనిచేస్తున్నారు. రాష్ట్రవిభజనచేసిన తర్వాత ఇందులో నూటికి అరవైమందులు ఇక్కడే మిగిలిపోతారు. కర్నూలులో సచివాలయ సిబ్బంది కూడా వెయ్యి మంది ఉన్నారు. కాబట్టి 16 వందలకు మించిన సిబ్బంది ఏర్పడుతారు. వీరందరూ శాఖలవారిగా కూర్చొని పనిచేయడానికి సచివాలయం కావాలి. రూ 90 లక్షలు పెట్టి కొత్త సచివాలయం కట్టించడానికి హైదరాబాదు ముఖ్యమంత్రి ఒకపథకం వేయించారు. దాని నిర్మాణాన్ని ఇవాళ ప్రారంభించినా, అది ఒక సంవత్సరంలోపుగా తయారుకాదు. కాబట్టి కొంతకాలం ఉన్న వసతిలోనే సర్దుకోవాలి.

మద్రాసులో ఉన్న ఆంధ్ర కార్యాలయాలు 16. వీటిల్లో 1450 మంది పని

5 వ పేజీ 1 వ కాలం చూడుడు

## జాతీయ పుస్తక సమితి

### నెలకొల్పడానికి రూ. 30 లక్షలు ద్వితీయప్రణాళికలో కేటాయింపు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 28: ఉత్తమ సాహిత్యకల్పనకు దోహదం కలిగించడానికి అనువుగా గ్రంథాల ప్రకటనకు ఒక జాతీయపుస్తక సమితిని నెలకొల్పాలని భారత ప్రభుత్వం నిశ్చయించింది. విద్యాసంస్థలు, గ్రంథాలయాలు, ప్రజలూ కూడా యీ గ్రంథాలను కొనుక్కొనేటట్లుగా వీటి ధరలు సరసంగా ఉంటాయి.

ఈ పుస్తక సమితి తన కార్యక్రమాన్ని కొనసాగించేందుకు, ద్వితీయపంచవర్ష ప్రణాళికా కాలంలో 30 లక్షలను కేటాయించినట్లు తెలుస్తున్నది.

ఈ సమితి ప్రధానంగా భారత పురాణ వాఙ్మయంలో పాటు విశేషియ భాషలలోని ప్రఖ్యాత గ్రంథాలను ప్రచురిస్తుంది. దేశంలో ఒకభాషలోని ప్రసిద్ధ గ్రంథాలను మరొక భాషలోనికి అనువదించడానికి యేర్పాట్లు చేస్తుంది.

భారత కళాఖండాల ముద్రణకూడ ఈ సమితి కార్యక్రమంలో ఉన్నది.

## చీనాలో ఇంకా స్టాలిన్ చిత్రాలు

పెకింగ్, ఏప్రిల్ 28: మేడేనాడు నగరంలో ఊరేగింపు కోసం మార్క్సు ఏంజల్సు, లెనిన్ చిత్రాలతో పాటు స్టాలిన్ చిత్రాలనుకూడా చీనా కార్మికులు తయారు చేస్తున్నారు.

ఇంతవరకు స్టాలిన్ పట్ల నిరసన సూచకంగా పార్టీ-పెకింగ్-పీపుల్సు డైలీ పత్రిక సంపాదకీయంలో వచ్చింది. అది మినహా స్టాలిన్ విమర్శలు లేవు.

## అరబ్-ఇజ్రేల్ యుద్ధ నివారణకు ప్రతిపాదన

### సమితి కార్యదర్శి కృషి ఫలించే సూచనలు

కైరో, ఏప్రిల్ 28: అరబ్ - ఇజ్రేల్ దేశాల మధ్య యుద్ధనివారణకు సమగ్రమైన పథకాన్ని ఐక్యరాజ్యసమితి కార్యదర్శి శ్రీ హామర్‌షెల్డ్ ప్రతిపాదించారనీ, ఈ ప్రతిపాదనలు ఫలించే సూచనలు కనపడుతున్నవనీ తెలుస్తోంది.

విడివిడిగా యుద్ధనివారణ సిద్ధాంతానికి శ్రీ హామర్‌షెల్డు ఇదివరకే ఈజిప్టు, ఇజ్రేల్ మొదలైన దేశాలన్నిటి ఆమోదాన్ని సాధించారు.

ఇప్పుడీ సమగ్రపథకాన్ని గురించి ఈజిప్టుతో చర్చించడానికి బైరూత్ నుంచి ఇవాళ కైరో వచ్చారు.

ఉభయపక్షాల సైన్యాలమధ్య 500 కిలోమీటర్ల ఎడం ఉండాలని గస్తీకేంద్రాలు, కేంద్రాలమధ్య సమితి పరిశీలకుల సంచారం, పరిశీలన మొదలైన అంశాలను కార్యదర్శి అన్ని దేశాలకూ ముందు అందచేశారు. ఇదివరలో అమలు జరగని సమితి ముఖ్యమైన తీర్మానాల ఆధారంపై కొన్ని సవరణలతో వీటిని తయారుచేశారు.

ఈ మారు ఈ ప్రతిపాదనలు అన్ని దేశాల ఆమోదం పొందగలవని ఇక్కడ విశ్వసిస్తున్నారు.

రెండు రోజులు కైరోలో చర్చలు జరిపి శ్రీ హామర్‌షెల్డ్ తరవాత ఇజ్రేల్ వెడతారు. ముందుగా ఉద్రిక్త పరిస్థితి కొంత శాంతిపడితేకాని సమగ్రమైన పాలస్తీనా పరిష్కార మార్గాన్ని శ్రీ హామర్‌షెల్డ్ చర్చించరు.

## బ్రిటన్ రష్యాల పరస్పర విశ్వాసం

### ప్రధాని శ్రీ ఈడెన్ ఆశాభావం

లండన్, ఏప్రిల్ 28: రష్యన్ నాయకుల బ్రిటన్ సందర్శనం ఫలితంగా ఉభయ దేశాల మధ్య విశ్వాసం వృద్ధి కావడం ప్రారంభం కాగలదని ఆశిస్తున్నట్లు బ్రిటిష్ ప్రధాని శ్రీ ఈడెన్, సోవియట్ నౌకలో స్వదేశం వెళ్లిపోతున్న రష్యన్ నాయకులకు సందేశం పంపారు.

ఈ సందర్శనం వల్ల అనుమానాలు తొలగిపోయినట్లు నమ్ముతున్నారని కూడా అన్నారు.

ఈ రెండు దేశాల మైత్రి, సహకారాలు ఉభయులకూ వాంఛితమైన ప్రపంచ శాంతి, సుహృద్భావాలకు దోహదమివ్వగలదని శ్రీ ఈడెన్ అన్నారు.

శ్రీ ఈడెన్‌కు రష్యా నాయకులు తమ నౌకనుంచి పంపిన వీడ్కోలు సందేశానికి జవాబుగా శ్రీ ఈడెన్‌పై ప్రతి సందేశం పంపారు.

## సమితివర్గాల సూచన

బైరూట్, ఏప్రిల్ 27: సమితి ప్రధానకార్యదర్శి డాగ్ హామర్‌షెల్డు తమ మధ్య ప్రాచ్య దేశాల దౌత్యాన్ని వచ్చేవారంలో పూర్తిచేయగలరని సమితి కార్యాలయ ప్రతినిధి ఒకరు తెలియజేశారు.

శ్రీ హామర్‌షెల్డు, ఇజ్రేల్ సరిహద్దులపై యిజ్రేల్‌తోపాటు అరబ్ రాజ్యాలన్నిటినుంచి నూత్న ప్రాయంగా యుద్ధవిరామ ఒడంబడికలను తీసుకున్నారు. వీరిప్పుడు రోమ్ వెళ్లి భద్రతాసంఘానికి సమర్పించాల్సిన నివేదికను పూర్తిచేస్తారు.

సమితి కార్యదర్శి రేపు కైరోవెళ్లి ఈజిప్టు నాయకులతో చర్చలు కొనసాగిస్తారు. అక్కడినుంచి యిజ్రేలీ నాయకులతో మరొక సమావేశం జరపటానికి టెల్‌అవీవ్ కు బయలుదేరుతారు. ఆ తరవాత వీరు వరాసరి రోమ్ చేరుకుంటారు.

శ్రీ హామర్‌షెల్డు రోమ్‌లో రెండు రోజులుంటారు.

డాగ్ హామర్‌షెల్డు, సమితి శాంతి పర్యవేక్షకదళాధికారి మేజర్ జనరల్ ఇ. యల్. యమ్. బరన్సు యీరోజున లెబనాన్ అధ్యక్షుడు శ్రీ కామిలీ చామూన్‌ను కలుసుకున్నారు. వీరు విదేశాంగ మంత్రి శ్రీ సలీమ్‌లాహౌడ్‌తో రెండుగంటలసేపు చర్చలు జరిపారు.

సమితి కార్యదర్శి ఈజిప్టు, ఇజ్రేల్‌లను పునర్దర్శించటంలోని ఆంతర్యం, మధ్యప్రాచ్యంలో శాంతి పర్యవేక్షకుల సంఖ్యను పెంచటం, ఆయన ఒడంబడికలను బలపరచే చర్యలు తీసుకోవటమని తెలుస్తున్నది.

## రష్యా నాయకుల హత్యకు కుట్ర

### బ్రిటన్‌లో పోలీసు బందోబస్తుకు ఇదే కారణంట

లండన్, ఏప్రిల్ 28: బ్రిటన్‌లో సోవియట్ నాయకులు (శ్రీ) బుల్గానిన్ (శ్రీ) క్రుశ్చేవ్‌లను హత్యచెయ్యడానికి కుట్ర జరిగిందనీ, కాని బ్రిటిష్ పోలీసు ఏజంట్లు ఈ కుట్ర విషయం ముందే తెలుసుకుని నివారించారనీ లండన్‌లో విషయజ్ఞులు తెలుపుతున్నారు.

సోవియట్ నాయకులు బ్రిటన్‌లో అడుగు పెట్టేముందు యూరప్‌లోని బ్రిటిష్ భద్రతా శాఖోద్యోగులు ఈ కుట్ర సమాచారాన్ని బ్రిటన్‌లోని ఉద్యోగులకు, అందచేశారట. అందువల్లనే పోర్ట్స్‌మత్ రేవునించీ సోవియట్ నాయకుల చుట్టూ ఏర్పాటుచేసిన పోలీసు రక్షణను రెట్టింపు పెంచారట.

ఈ కుట్ర సమాచారం అబద్ధం ఎంతమాత్రం కాదని పై వర్గాలు చెప్తున్నారు.

యూరప్‌లోని ఇతర దేశాలలో ఉన్నంత కఠిన రక్షణ నిర్బంధాలు ఈసారి కొత్తగా బ్రిటన్‌లోకూడా అమలుజరిపి ప్రజలకు చికాకు కలిగించడానికి ఇదే కారణం.

అయితే ఈ కుట్రను గురించి ప్రశ్నించినప్పుడు బ్రిటిష్ విదేశాంగశాఖ అంతరంగిక భద్రతా శాఖ (స్కాట్లండ్ యార్డ్) వ్యాఖ్యానించడానికి నిరాకరించాయి. అయితే సోవియట్ నాయకుల హత్యకు కుట్ర జరిగిన సమాచారం అందినమాట నిజమే అని ప్రభుత్వ సన్నిహితవర్గాలు ఒప్పుకున్నారు.

కుట్ర పన్నినవారు బ్రిటన్‌లోనూ, యూరప్‌లోనూ నివాసం ఏర్పరుచుకున్న దేశాంతర్గతులని తెలుస్తోంది. ఒకరు పొరపాటున విషయం ఎవరికో చెప్పేస్తే, అది బ్రిటిష్ అధికారులకు తెలిసిందట.

సోవియట్ నాయకులు బ్రిటన్‌లో కొన్ని ప్రాంతాలు దర్శించే కార్యక్రమం మానడానికి ఇదే కారణం అనీ, తీరిక లేకపోవడం కాదనీ ఇప్పుడు అర్థమౌతోందట.

## రాజకీయ బాధితులకు అంబర్ చర్ఖా ఉద్యోగాలు

అలహాబాద్, ఏప్రిల్ 28: దేశంలో ఉన్న రాజకీయ బాధితుల నందరినీ, అంబర్ చరఖా పథకంలోకి తీసుకుంటారని అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రీమన్నారాయణ్ ప్రకటించారు.

'ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 25 లక్షల అంబర్ చరఖాలు ఆచరణలోకి వస్తాయని' స్థానిక కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో మాట్లాడుతూ కాంగ్రెసు కార్యదర్శి తెలియజేశారు.

## ఒంగోలు-బందరు మధ్య గాలివాన

మద్రాసు, ఏప్రిల్ 29: ఇవాళ ఉదయం 8-30 కి నెల్లూరుకు 120 మైళ్ళ తూర్పున చిన్న గాలివాన ఇవాళ రాత్రి ఉన్నట్టైతే ఒంగోలు – బందరు మధ్య సముద్రతీరం దాటుతుందని మద్రాసు వాతావరణ నిలయం ప్రత్యేక ప్రకటన చేసింది.

మద్రాసు సీమరేవులలో ఓడలకు హెచ్చరికగా "గుపాను" పతాకము ఎత్తాలని ఈ నిపుణులు సలహా యిచ్చారు.

వాయుపీడనం ప్రభావం వల్ల ఈ రాత్రి కోస్తా ఆంధ్రదేశంలో కుంభవృష్టి, సుడిగాలి రేగగలదని నిపుణులు ప్రకటిస్తున్నారు.

